

# భయము - అభయసిద్ధి

ప్రణేత

## స్వామి ప్రజ్ఞానంద

ప్రచురణ

శ్రీ ప్రజ్ఞానానంద భక్తసేవాసమితి

చిదానందాశ్రమము - పళివేదల

పశ్చిమగోదావరిజిల్లా

శ్రీమత్ స్వామివారి 71 వ జన్మదినోత్సవ పూజాకుసుమము



మూల్యము : 0-50

ప్రథమ ముద్రణము
ప్రతులు 1000

ప్రతులు లభించుస్థానము:
శ్రీ ప్రజ్ఞానానంద భక్తసేవాసమితి
చిదానందాశ్రమము- పశివేదల-పోష్టు
వయా- చాగల్లు- పశ్చిమగోదావరిజిల్లా.

ప్రమాది – ఆశ్వయుజ బ. పాడ్యమి స్థిరవారము
13–10–1973.

శ్రీ వెంకటేశ్వర ప్రింటింగువర్క్సు,
కొవ్వూరు.



శ్రీ మత్పూజ్యపాద

స్వామి ప్రజ్ఞానానందగిరి

ఓం

శ్రీ గురుభ్యోనమః

# ప్రకాశకుల ప్రస్తావన

ఈ చరాచరవ్యక్తప్రపంచము భిన్ననామరూపగుణకర్మలతో భేదప్రవర్తకమై సంయోగవియోగమోహశోకభయాలవాలమై యుండుట గనుచున్నాము. మరియు నిత్యాది షడ్భావవికారపరిణామముల నొందుచు క్షణభంగురమై, నశ్వరమై అసత్తగుచున్నది. అనుక్షణ పరిణామరూప నామ రూపక్రియా ప్రపంచము నిజసత్తాకలదిగానందున విశ్వసింపదగినదిగాదు. "దుఃఖాలయమశాశ్వతమ్" అని ప్రపంచస్వభావమును శ్రీకృష్ణ భగవానులు వివరించిరి.

దుఃఖమునే తాపమనియు, భయమనియు, బంధమనియుగూడ వ్యవహరింతురు.

అనృతజడదుఃఖాత్మకమును, కించిజ్జ్ఞమును, భేదరూపమును అగు నామరూపక్రియాప్రపంచముతోడి సంసర్గ, తాదాత్మ్య అధ్యాసలే మానవుల దుఃఖభయబంధములకు మూలము. అధ్యాసజనక భేదదృష్టికి అజ్ఞానజనితపరిచ్ఛిన్న అహంవృత్తియే మూలము. ఈ విషయమే శ్రీమచ్ఛంకరభగవత్పాదులు వివేకచూడామణియందిట్లు నిర్వచించిరి :

శ్లో॥ "సన్త్యన్యే ప్రతిబన్ధాః పుంసః సంసారహేతవో దృష్టాః।
తేషామేకం మూలం ప్రథమవికారో భవత్యహంకారః॥"

ఈ అహంవృత్తిప్రవృత్తియే సమస్త భేద, సంసృతి, భయ, బంధములకు మూలకారణమగుచున్నది. గాన జనన మరణరూపసర్వభయబంధములనుండియు విముక్తినొంది పరిపూర్ణత్వసిద్ధి నొందవలెననిన ఈ అహంవృత్తివిలయమే కర్తవ్య సాధనము.

"ఈశావాస్యమిదగ్ం సర్వంయత్కించ జగత్యాం జగత్"
(ఈశావాస్య)

"తథాఽక్షరాత్ సంభవతీహ విశ్వం" (ముండక-ఉ)

"ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః"

"యోలోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః" (గీత)

"సర్వం ఖల్విదం బ్రహ్మ నేహనానాస్తి కించన"

అనుశ్రుతిప్రమాణములు ఘోషించునటుల అనంత, సత్య, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, పరిపూర్ణాఖండాద్వయ సచ్చిదానందపరబ్రహ్మమే సర్వాత్మయు సర్వజగదాధారము నైన నిజతత్త్వమై తేజరిల్లుచున్నది. అట్టి అనంతాద్వయ సచ్చిదానంద బ్రహ్మైక్యసిద్ధియే సర్వబంధములనుండియు, భయములనుండియు విముక్తినొందించి సాధకునకు పరిపూర్ణతను ప్రసాదించును. గాన బ్రహ్మైక్యానుసంధాననిదిధ్యాసచే అహంవృత్తిని విలయమొందించి అనంతాద్వయానందపూర్ణ బ్రహ్మైక్యసిద్ధినొంది అభయసిద్ధిని బడసి తరింపజెల్లును.

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య స్వామి ప్రజ్ఞానానందపూజ్యపాదులు 1942 వ సంవత్సరమున "తిరుపతి–తిరుమల"లోని వైకుంఠతీర్థగుహాయందు ఏకాంతవాసము సల్పుచు, అనవరతబ్రహ్మాత్మైక్యరసానుభూతినొందుచు, తదనుభూతిని "సర్వభూతేభ్యోఽభయం భూయాత్" అను సర్వసన్యాసపూర్వక శ్రుతిసూత్రము నాధారముగాగొని పైవివరించిన ఆధ్యాత్మిక సాధనవిధానమును "భయము – అభయసిద్ధి" యనుపేరున స్వాత్మానందార్థమును, ముముక్షుజనహితార్థమును రచించిరి. రచించి చాలాకాలమైనది. అమూల్యమైన ఈ యాధ్యాత్మిక వ్యాసమును భక్తజనుల ప్రార్థనపై పూజ్యస్వామివారి యనుమతిని బడసి ముముక్షుజనహితార్థము "శ్రీప్రజ్ఞానానందభక్త సేవాసమితి"వారమగు మేము ప్రచురింపబూనుకొంటిమి. జిజ్ఞాసువులు బుధజనులు దీనిలాభము నొందుదురుగాక యని మా ప్రార్థన.

ఈ యాధ్యాత్మిక యుత్తమవ్యాసమును అత్యంతసాదరాభిమానములతో పరిశోధించి అమూల్యమగు ఉపోద్ఘాతమును మాకందించిన పండితులును, సాధుహృదయులును, పరమార్థతత్పరులునగు బ్రహ్మశ్రీ కొల్లి అనంతపద్మనాభశాస్త్రిగారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఆధ్యాత్మికసాధనతత్పరులు, నిష్కళంకహృదయులు, పూజ్యస్వామివారి అంతరంగికభక్తులునగు శ్రీ టి. జోగిరాజు

(విశాఖజిల్లా, నక్కపల్లి సమితి, బి.డి.ఓ.)గారు ఈ వ్యాసమును గాంచి, కడుసంతోషించి ముముక్షుజనహితార్థము ప్రచురించుట శ్రేయోదాయకమని ప్రోత్సహించిరి. కావున వారికిని మా కృతజ్ఞతలు.

శ్రద్ధతో ఈ గ్రంథముద్రణమును సుందరముగా నిర్వహించిన శ్రీ వెంకటేశ్వర ప్రింటింగువర్క్సువారికి మా కృతజ్ఞతలు.

ఓం సర్వేషాం శాంతిర్భవతు !

| | |
|---|---|
| చిదానందాశ్రమము | ముదిగంటి సత్యనారాయణ |
| పశివేదల | కార్యదర్శి |
| ది 6–10–1973 | శ్రీ పరిజ్ఞానానంద భక్తసేవాసమితి |

# పరిచయము

కొల్లి అనంతపద్మనాభశాస్త్రి
రిటైర్డు ప్రిన్సిపాల్
ఎస్. జి. వి. పి. ఓరియంటల్ కాలేజి
రాజమండ్రి

శ్రీ శ్రీ శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య ప్రజ్ఞానానంద స్వాములవారిచే ప్రసన్నగంభీరశయ్యలో రచితమై నాయందవ్యాజవాత్సల్యముచే పంపబడిన "భయము-అభయసిద్ధి" అను బహువిధ వేదాంతార్థ ప్రతిపాదకమగు మహోవ్యాసమును సాంతము చదివితిని. మహానందమునందితిని.

శ్రీస్వాములవారు పూర్వాశ్రమమున ఉపనయనానంతరము కొలదికాలములోనే ప్రాగ్జన్మసమాసాదిత సత్సంస్కారవిశేషముచే ఐహికవిషయవైరాగ్యసంపన్నులై ముముక్షువులై పరమహంసలకు సదాశ్రయమగు పవిత్రహిమాచల ప్రాంతములకేగి యట శ్రీమత్పూజ్యపాద జ్ఞానానంద స్వాములవారిని శుశ్రూషించి తపోనిష్ఠలోనుండి యాగురుదేవులవలన ఔపనిషదరహస్యముల కూలంకషముగ నెఱింగిరి. బ్రహ్మనిష్ఠులై స్వయంతీర్ణులైరి. భక్తులనుదరింపజేయుటకు పశ్చిమగోదావరీమండలస్థ పశ్వాదలాశ్రమమందు ముముక్షువులగు భక్తులకు వేదాంతరహస్యములను వాత్సల్యముతో బోధించు

చుండుట బహుజనులకు విదితచరము. శ్రీవారితో నేనును చిర కాలపరిచయభాగ్యముగలవాడను.

స్వాములవారు ఉపనిషత్తులు, భగవద్గీత, వివేకచూడామణి, భర్తృహరి సుభాషితములు మున్నగు ప్రమాణగ్రంథముల నాధారముగాజేసికొని తమ బ్రహ్మనిష్ఠవలని యాత్మానుభూతిని మేళనముచేసి యీయుత్తమ వ్యాసరాజమునురచించి భక్తులకందజేసిరి.

శ్రీశంకరభగవత్పాదులవారు తమ శారీరకభాష్యగ్రంథమున మొదటఉపోద్ఘాతముగా నధ్యాసభాష్యమును రచించిరి. యుష్మత్ప్రత్యయగోచరమగువిషయము(దృశ్యము) అస్మత్ప్రత్యయగోచరమగు విషయి(జ్ఞానము స్వయంప్రకాశరూపము) యు తమః ప్రకాశములవలె విరుదస్వభావములు.వానికి వాస్తవిక మేళనముసంభవముకాదు.అయినను సత్యానృతములగు జ్ఞానజడములను మేళనముచేసి లోకవ్యవహారము ప్రవృత్తమయినది. ఈ ఆత్మానాత్మతాదాత్మ్యము అధ్యాసవలననే యని సెలవిచ్చిరి. అధ్యాసయనగా "అతస్మింస్తద్బుద్ధిః"యని నిర్వచించిరి. ఈ అధ్యాసయే ద్వైతభావనకుమూలము. ద్వైతభావనచేతనే భయభావభావము కల్గినది. ఈయధ్యాసగ్రంథములోని సారాంశమునంతను స్వామివారు తమవ్యాసములోన "భయము" అనుభాగమున వివిధదృష్టాంత దార్ష్టాంతికములతో సవిస్తరముగా జిజ్ఞాసువులకు కరతలామలకము గావించిరి .మరియుద్వైత శబ్దనిర్వచనము వివరముచేసిరి అహంత్వా ప్రత్యయార్థభేదస్ఫూర్తిచేతనే

ద్వైతభావము కల్గినదని సప్రమాణముగా సయుక్తిగ నిరూపించిరి. "ధ్యాయతో విషయాని" త్యాది గీతాస్మృతివాక్యములచే నిదియే బంధహేతువుగా తెల్లముగావించిరి.

పరమపురుషార్థము మోక్షము. అది బ్రహ్మజ్ఞానముచే గాని ప్రాప్యముగాదు. "నాన్యః పంథా విద్యతేఽయనాయ-న స పునరావర్తతే-బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాది శ్రుతిశిరోవాక్యములు బ్రహ్మజ్ఞానమాత్ర గమ్యము ముక్తియనియు, ముక్తునకు పునరావృత్తిలేదనియు స్పష్టపఱచుచున్నవి. ముక్తి యన బ్రహ్మాత్మనావస్థితియేయని చాటుచున్నవి. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" యనిగదా! ముక్తినిసంపాదించుటయే మానవ జీవిత పరమలక్ష్యము. శమదమాది సంపత్తిగలిగి పురాకృత సుకృత పరిపాకవిశేషమున విషయపరాఙ్ముఖుడై, సద్గురూపసదనముచేసి ఆతని కరుణాకటాక్షముచే శ్రవణాదులచే బ్రహ్మజ్ఞానియై తరించును. అట్టి బ్రహ్మనిష్ఠచేతనే అభయసిద్ధియగునని యనేక వేదాంతవాక్యములతో స్వాములవారు విశదీకరించిరి.

బ్రహ్మసూత్రములలో 4వ సూత్రము "తత్తుసమన్వయాత్" యనునది. ఆ సూత్రభాష్యములో సర్వజ్ఞము, సర్వశక్తి, జగదుత్పత్తి స్థితికారణము అగు పరబ్రహ్మము వేదాంత శాస్త్రముచేతనే తెలియబడును. సర్వోపనిషదవాక్యములు 'సదేవసోమ్యేదమగ్రఆసీత్' ఇత్యాదులు అద్వైత బ్రహ్మపరములుగనే సమన్వితములని పరపక్ష నిరాసపూర్వకముగా

యుక్తులచేతను ప్రమాణములచేతను బహువిధములుగా నిరూపింపబడినది. పై విషయములసారమును స్వాములవారు తమ వ్యాసములో మృదుమధురశైలిలో జిజ్ఞాసువులకు నందజేసిరి. ఇది కడుప్రశంసాపాత్రము.

మరియు "తత్త్వమసి"యను ఛాందోగ్యశ్రుతి మహావాక్యములోని త్వంపదార్థము భయహేతువగను,తత్పదార్థము అభయసిద్ధి సంధాయకముగను, అసి జీవబ్రహ్మైకభేద బోధకముగను, అదియే పరమపురుషార్థమనియు, వీరు సప్రమాణముగా నిరూపించినట్లు భావింతును.

కావున ప్రతిమానవుడును అభయసిద్ధికై సాధనచేయవలయును. అది సద్గురుప్రసాదలభ్యము. దానిచేత మహత్తర సంసారపారావారతరణము. అదియే నిత్యసుఖావాప్తి. తద్రూపమయినదియే భయనాశము, అభయసిద్ధి అని భక్తుల తరణోపాయముగ ఉపదేశరూపమగు నీమహావ్యాసమును వీరు రచించిరి. ఉన్నతభావగంభీరము, సప్రమాణమును, భక్తుల కత్యంతోపకారకమునగు నీవ్యాసమునకు కర్తలగు శ్రీ స్వాములవారికి నా నమస్కృతములు.

ప్రమాదివత్సర శ్రావణ పూర్ణిమ

విధేయుడు
కొల్లి అనంతపద్మనాభశాస్త్రి.



ఓమ్

నమో భగవతే జ్ఞానానందాయ!

# భయము - అభయసిద్ధి

జగమంతయు సజాతీయ విజాతీయ స్వగత భేదములచే ద్వైతభావాత్మకమైయున్నది. ఈ విషయము ప్రత్యక్షప్రమాణముచే నెల్లరకు విదితమే. మరియు ద్వైతభావముతో సహావర్తియై జగమంతటను ప్రచండవ్యాప్తిచెంది జీవులను కలవరపఱచు మరొండు విషయము గూడగలదు. 'ద్వితీయాద్వై భయం భవతి' 'యత్కించిత్పశ్యతో భేదం భయంబ్రూతే యజుః శ్రుతిః'. ఎచట ద్వైతప్రతీతి కలదో అచటనెల్ల భయము సిద్ధమని శ్రుతులు ఘోషించుచున్నవి. ఈ జగమునగల జీవజాలమున కెల్ల జన్మాదిగా భయభావముగూడ సిద్ధమైయున్నది. స్వస్థాన స్వసుఖ భ్రష్టతలే అనగా స్వస్వరూప స్వసుఖ తిరోధానమే భయశబ్దార్థముగా నైఉంగునది. స్వస్థితికి వికల్పమును గూర్చనదే భయము. ఈ భయమునే బంధమనియు, దుఃఖమనియు, బాధయనియు, సంసృతియనియు శ్రుతిశాస్త్రాదులందు బేర్కొనిరి.

"మృత్యునాభ్యాహతం లోకః వ్యాధిభిశ్చోపపీడితమ్" "జన్మదుఃఖమ్ జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః, సంసార సాగరందుఃఖమ్" అనుప్రమాణములు దుఃఖహేతు భయనిరూ

పణముచేయుచున్నవి. ఈభయవిస్తృతిని మహాకవి భర్తృహరి యీక్రిందిశ్లోకములందు చక్కగ నుల్లేఖించెను :

శ్లో: ఆఘ్రాతం మరణేన జన్మ, జరయా విద్యుచ్చలం యౌవనం
సంతోషోధనలిప్సయా, శమసుఖం ప్రౌఢాంగనా విభ్రమైః।
లోకైర్మత్సరిభిర్గుణా, వనభువో వ్యాళైర్నృపా దుర్జనై
రస్థైర్యేణ విభూతిరప్యుపహతా గ్రస్తం న కిం కేన వా॥
(వైరాగ్యశతకము-32)

శ్లో॥ గాత్రం సంకుచితం గతిర్విగళితా భ్రష్టాచ దంతావళి
ర్దృష్టిర్నశ్యతి వర్ధతే బధిరతా వక్త్రించ లాలాయతే।
వాక్యం నాద్రియతే చ బాన్ధవజనో భార్యా నశుశ్రూషతే
హా! కష్టం! పురుషస్య జీర్ణవయసః పుత్రోఽప్యమిత్రా
యతే॥
(వైరాగ్యశతకము —73)

శ్లో॥భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయాభయం
శాస్త్రే వాదిభయం గుణే ఖలభయం కాయేకృతాన్తాద్భయం
సర్వంవస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయమ్.
(వైరాగ్యశతకము-31)

పైనుదాహరించిన ప్రమాణములచే లోకమందెల్లెడల భయవ్యాప్తి కలదని స్పష్టమగుచున్నది. ఈ భయవ్యాప్తికి మూలము ద్వైతవ్యాప్తియేయని పైనుదాహరించి యుంటిమి.

ద్వైతవ్యాప్తి యనగా పృథక్ భానము లేక భిన్నభావము లేక భేదభావము లేక నానాత్వభావముయొక్క వ్యాప్తి యని యర్థము. ద్వైతభానముతో (పృథక్త్వముతో)గూడిన యీ జగమంతయు ద్రష్ట-దృశ్యము లేక జ్ఞాత-జ్ఞేయము లేక విషయి-విషయము అని రెండుగా విభజింపదగియున్నది. ఈ రెంటినే "అహం ప్రత్యయార్థము""త్వం ప్రత్యయార్థము" అని కూడా చెప్పవచ్చును. ఇచ్చట అహం ప్రత్యయార్థమును ద్రష్టగను, త్వంప్రత్యయార్థమును అహంప్రత్యయార్థభిన్నమగు త్వంతత్ ప్రత్యయార్థ నానాత్వసముదాయముతోగూడిన దృశ్యముగను ఎఱుంగునది. తత్ ప్రత్యయార్థ సంఘాత దృశ్యమంతయు త్వం ప్రత్యయార్థ బాహుళ్యమేగాని మరొండుగాదు. అహం ప్రత్యయార్థద్రష్టకు భిన్నమగు దృశ్యమయసంఘాతము సమీపస్థమగుచో త్వం ప్రత్యయార్థముగను, దూరస్థమగుచో 'తత్ ప్రత్యయార్థ'(అది, ఆ, వాఁడు) సంఘాతముగను వ్యవహరింప బడుచుండుటచే దృశ్యమంతయును త్వం ప్రత్యయార్థముగను, ద్రష్ట 'అహం' ప్రత్యయార్థముగను నిచ్చట ప్రయోగింపబడినదని గ్రాహ్యము.

జగమున గోచరించు ద్వైతవ్యాప్తి యంతయు పై జెప్పిన అహంప్రత్యయార్థ, త్వంప్రత్యయార్థ భేదమునే యాశ్రయించి యున్నది.'అహంప్రత్యయార్థ త్వం ప్రత్యయార్థ'భేదస్ఫూర్తి లేని తరి విశ్వమంతట ద్వైతభయభానము లే పొసగుటకు తావు లేదు.

దేశకాల పరిచ్ఛిన్నమును, షడ్భావవికారయుక్తమును దేహేం ద్రియ ప్రాణ మనోభిమానయుక్తమును కించిజ్ఞమును అగు 'అహంప్రత్యయార్థము' (నేనుఅనెడి ద్రష్టృభావము) స్ఫురించి నంతనే అన్యలక్షణయుక్తమైన త్వం ప్రత్యయార్థము (నీవుఅనెడి దృశ్యార్థజ్ఞానము) యొక్క పృథక్త్వస్ఫూర్తి అగుచున్నది. ఈరీతి 'అహం,త్వం' ప్రత్యయార్థముల పృథక్త్వభానమే భయ భానమునకు మూలాశ్రయము. 'అహం,త్వం' ప్రత్యయార్థములు ఏకదేశీయములుగాక భిన్న దేశస్థములగుటచే నీ రెంటికిని ఐక్యము పొసగనేరదు. భిన్న దేశస్థములగుటచే ఈరెండును పృథక్త్వ మును అన్యోన్యసంఘర్షణ సంబంధవర్తనమునుమాత్రమే కల విగా అగుచున్నవి. (They affect and exist in terms of relation to each other.) ఈ 'అహం,త్వం' ప్రత్యయార్థ ముల అన్యోన్యసంఘర్షణ సంబంధమే పరస్పరబాధాజనకమై సర్వానర్థములకు భయమునకు స్వరూప, స్వసుఖతిరోధానము లకు హేతువగుచున్నది. 'అహం,త్వం' ప్రత్యయార్థములు భిన్న దేశస్థములగుటచే ఈరెంటియెడ ద్రష్టృ-దృశ్య, జ్ఞాతృ-జ్ఞేయ, భోక్తృ-భోగ్యాది సంబంధమును అన్యోన్యాకర్షణాపకర్షణ సం బంధములును భాసించుచున్నవి. ఇట్టి పరస్పరసాంబంధిక ఘర్ష ణమందు 'త్వంప్రత్యయార్థము' అహంప్రత్యయార్థమునకు విష యమును, భోగ్యమును అగుచుండ సమవిషమరూపములైన సుఖదుఃఖ, ప్రియాప్రియ, అనుకూలప్రతికూలాద్యనుభవములు 'అహం' ప్రత్యయార్థజ్ఞాతకు చేకూరి స్వస్వరూప స్థితిని బోధిం

చుచుండును. విషమరూపమైన దుఃఖ, అప్రియ, ప్రతికూలా ద్యనుభవములెట్లుల బాధాజనకమో, సమరూపమైన సుఖ, మోద, ప్రియ, అనుకూలాద్యనుభవములుకూడ మోహశోకా స్పదములగుటచే అట్లే బాధాజనకములుగా నెరుంగనగును. అహం,త్వంప్రత్యయార్థ సముదయమంతయు పరిచ్ఛిన్నమును షడ్భావవికార యుక్తమును క్షరమును అగుటచే 'త్వం'ప్రత్య యార్థసంఘాత సంగానుభవములును క్షణప్రధ్వంసములై 'అహం' ప్రత్యయార్థజ్ఞాతకు సంయోగవియోగ మోహశోకాది ఫలానుభవవికల్పములను జనింపజేసి బాధించును. కావున 'త్వం' ప్రత్యయార్థ సంఘాతసంగజనితమగు సమవిషమఫలానుభవమం తయు బాధాజనకముగా నెఱుంగునది. ఈవిషయమునే శ్రీకృష్ణ భగవానుఁడు గీతయందిట్లు ప్రబోధించెను.

"ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥
(గీత. 2-62)

"క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥ (2-63)

పైనుదాహరించిన విషయమును బట్టి 'అహం-త్వం' ప్రత్యయార్థస్ఫురణయును వాని అన్యోన్యసాంబంధిక వర్తన మ్మును సమస్తద్వైతవ్యాప్తికిని భయభానమునకును మూలమని విదితమగుచున్నది. కాని యిచట వేఱొక సూక్ష్మవిషయము

గమనింపవలసియున్నది. "అహం-త్వం" ప్రత్యయార్థములరెండిటిలో "అహం"ప్రత్యయార్థమే "త్వం" ప్రత్యయార్థమునకు కూడ మూలమగుచున్నది. ప్రతివ్యక్తికిని స్వకీయమగు 'అహం' ప్రత్యయార్థస్ఫురణమైనపిదపనే పరకీయమగు 'త్వం' ప్రత్యయార్థస్ఫూర్తి కలుగుచున్నది. అనగా 'అహం'ప్రత్యయార్థ జాగ్రత్తానంతరమే త్వంప్రత్యయార్థభానము చేకూరుచున్నది. ఎప్పుడు అహంప్రత్యయార్థమభావదశనొందుచున్నదో త్వంప్రత్యయార్థముకూడ అపుడే అభావదశనొందుచున్నది. 'యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి' యని వర్ణింపబడిన సుషుప్తియందు అహంప్రత్యయార్థముయొక్క అనభివ్యక్తతచే త్వంప్రత్యయార్థముకూడ అనభివ్యక్తముగనే యుండుచున్నటుల ఎల్లరకు విదితమే. త్వంప్రత్యయార్థము, అహం ప్రత్యయార్థముయొక్క అనభివ్యక్తావస్థయందు లీనమై యుండి అహం ప్రత్యయార్థమభివ్యక్తమైనవెంటనే తానును అభివ్యక్తమగుచున్నది. కాన త్వం ప్రత్యయార్థసముదయమంతయు అహం ప్రత్యయార్థమునుండి జనించుచున్నటుల గ్రహింపదగును. అనగా ద్వైతభయమంతయు 'అహం' ప్రత్యయార్థ మూలముగా నెసంగునది. ఈ విషయమునే శ్రీమచ్ఛంకర భగవత్పాదులిట్లు వివరించిరి.

సంత్యన్యే ప్రతిబంధాః పుంసః సంసారహేతవో దృష్టాః ।
తేషామేకం మూలం ప్రథమ వికారో భవత్యహంకారః ॥

యావత్స్యాత్స్వస్య సంబంధోఽహంకారేణ దురాత్మనా।
తావన్న లేశమాత్రాపి ముక్తివార్తా విలక్షణా ॥
(వివేకచూడామణి 299, 300)

మరియు ఈ విషయమై శ్రుతి ఇట్లు నుడువుచున్నది.

'అహంకారాదవివేకః, అవివేకాదభిమానః, అభిమానాద్రాగోదయః, రాగోదయాత్కర్మాణి, కర్మణా శరీరపరిగ్రహః, శరీరపరిగ్రహాద్దుఃఖమ్'. అహం వృత్తియొక్క పరిచ్ఛిన్న జ్ఞానముచే అఖండాత్మజ్ఞానములేని భేదభావజనకమగు అవివేకమును, అవివేకముచే స్వాశ్రిత, దేహేంద్రియ, ప్రాణమనస్సంఘాతము నెడ "తాను-తనయొక్క" యనెడి తాదాత్మ్యబుద్ధియు, అట్టి తాదాత్మ్యాభిమానముచే తాదాత్మ్యసంఘాతము నెడను తదనుకూల బాహ్యవిషయసంఘాతము నెడను అత్యంతానురాగమును (ప్రతికూలసంఘాతము నెడ ద్వేషమును) ఆ యనురాగకారణముచే "కార్పణ్యదోషోపహత స్వభావః" యని అర్జునుడు పల్కిన చందమున ధర్మాధర్మ, కార్యాకార్య వివేకశూన్యమైన స్వార్థపూరిత (దురిత) కర్మాచరణమును, (భేదభావయుక్తమగు స్వార్థకర్మాచరణమే సంసృతిమూలమును, అఖండాత్మజ్ఞానప్రతిబంధకమును అగుటచే దురితకర్మాచరణముగా నెఱుంగునది.) కర్మాచరణముచే తత్తత్ఫలానుభవసాధనములగు దేహగ్రహణము, దేహధారణచే కర్మఫలానుభవ భయరూపమైన ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధి

దైవిక సుఖప్రాప్తియు ప్రసరించుచున్నదని పై శ్రుతియొక్క భావార్థము.

ఈ భయావస్థ జీవుల యాశ్రితమును, అభీష్టమును, సహజధర్మమునై యున్నదా యనిన అటుగాదు. అభీష్టవస్తు సిద్ధికై సర్వదా ఉత్సుకతీవ్రాన్వేషణయు ప్రయత్నమును స్వాగతహృదయమును ఆవశ్యకములు. కాని భయావస్థయెడ జీవులకాలక్షణములు లేనటుల ప్రత్యక్షమే చాటుచున్నది. భయవికల్పములు వారల నావరించుతఱి సర్వవిధముల తత్ప్రతీకారచేష్టయే సల్పుటయు, స్వాగతహృదయమునకు మారు ఉద్విగ్నదృష్టితో తద్దూరీకరణసాధనముల నన్వేషించుటయు ఎల్లెడల గాంచుచున్నాము. దైన్యమును, రోగమును, దుఃఖమును, నాశమునుగల భయావస్థనుగూర్చి ప్రయత్నించువారలనుగాని, ఆహ్వానించువారలనుగాని, సమ్మోదమునొందువారలనుగాని కానము. క్షుద్బాధయందాహారగ్రహణమును, పిపాసతాపమందు స్వాదుజలపానమును, శీతోష్ణాదిపీడలందు తత్తదుపచారములును, రోగబాధయందు ఔషధసేవనయు, దౌర్బల్యమందు పౌష్టికపదార్థసేవనయు, కామాగ్నిసంతాపమందు మిథునసంయోగమును, దారిద్ర్యమందు ధనికాశ్రయమును, శత్రుబాధయందు మిత్రసహాయమును, వియోగాదులందు బంధుజనాదరమును, క్రూరగ్రహ, మృగ, వ్యాళ, వృశ్చికాది బాధలందు మంత్ర తంత్ర మణి ఔషధప్రయోగములను, వర్ష,

అశనిపాతాదిభయమందు గృహాలయాది ఆశ్రయమును, మానసికవిచారములందు కేళీవిలాససల్లాపములను, అంధకారమందు దీపాశ్రయమును, అజ్ఞానమందు విద్యాధికునాశ్రయమును, వార్థక్య, మరణబాధలందు సర్వరక్షకశరణయు బడయుచు నిట్లు సర్వోపాయముల భయప్రతీకారమునే జీవులెల్లరు గావించుచుండుట తెల్లమే. పై జెప్పిన క్రియాంశములన్నియు భయప్రతీకారములగునే కాని భయాహ్వానమనికాని, అభీష్టసిద్ధియత్నమని కాని నుడువరాదు. ఈ విషయమే భర్తృహరిమహాకవి సమంజసముగా నీరీతి వచించెను :

"తృషా శుష్యత్యాస్యే పిబతి సలిలం స్వాదు సురభిః
క్షుధార్తస్సన్ శాలీన్ కబళయతి శాకాదివలితాన్ ।
ప్రదీప్తే కామాగ్నౌ సుదృఢతరమాశ్లిష్యతి వధూమ్
ప్రతీకారో వ్యాధేః సుఖమితి విపర్యస్యతి జనః" ॥

(వైరాగ్యశతకము-19)

పై నిరూపించినచొప్పున ప్రతీకారచేష్టనుబట్టి భయావస్థ జీవులయభీష్టమును, సహజధర్మమును కాజాలదని సుస్పష్టము.

ఇక జీవుల యభీష్టమును, సహజావస్థయు నెద్ది? ఏ సిద్ధికై నిరతోద్యోగులగుచున్నారు? అను ప్రశ్నకుత్తరము సుగమమే. వైకల్పిక అనర్థరూపమైన భయావస్థకు ప్రతీకారమెపుడు సల్పుచున్నారో అప్పుడే తద్విముక్తికిని, తద్భయ

రహిత,నిశ్చల,నిత్య నిరతిశయానంద, స్వస్వరూప, అభయస్థితి నభీష్టించుచున్నారనియు, అదియే వారల స్వస్వరూపమనియు సహజావస్థయనియు అనుమితమగుచున్నది. ఇట్టి అభయస్వ రూపమే వారల సహజస్వరూపమును, నిజసత్తాయును నగుట జేసి ఏతచ్ఛిద్ధిని కోరుచున్నారు. యథార్థముచే నొకానొక వస్తువు నెడ ప్రీతి తన యాత్మార్థమేకాని విషయార్థమై కాదు. ఆప్రియపదార్థమందలి నిజాస్తిత్వము తన స్వరూపము గావుననే ఆపదార్థము ప్రియమగుచున్నది. ఎవనికిని తన స్వరూపము కంటెను అనగా తన ఆత్మకంటెను ప్రియపదార్థమెద్దియు నుం డబోదు. మరొండు పదార్థముగా గోచరించునది తనకు ప్రియ జనకముగ నున్నచో అపదార్థముయొక్క నిజసత్తాకూడ తన స్వరూపమగుటచేతనే ప్రియమగుచున్నదని గ్రాహ్యము. 'ఆత్మ నస్తు కామాయ సర్వం ప్రియం భవతి" యని బృహదారణ్యక శ్రుతియు, "ఆత్మార్థత్వేనహి ప్రేయాన్ విషయో న స్వతః ప్రియః. స్వత ఏవహి సర్వేషామాత్మా ప్రియతమో యతః" యని వివేకచూడామణియు, (శ్లో॥ 108) నుద్ఘోషించుచున్నవి. కావున జీవుల యభీష్టమగు పైనిరూపించిన యభయస్వరూ పము వారల సహజస్వరూపము కావుననే ప్రియమై, ఈప్సి తమై యున్నదనియు, కావుననే తదభయసిద్ధికై జీవులు నిర తోద్యోగులై ప్రవర్తించుచున్నారనుటయు నిర్వివాదాంశము.

ఇక అభయస్వరూప సత్తా నిర్ణయమెట్లను విషయము న్వేషింపదగును. "అహం—త్వం" ప్రత్యయార్థ హేతుసంఘాత

మంతయు భయస్వరూపమని నిరూపించియే యుంటిమి. 'అహం-త్వం' ప్రత్యయార్థసంఘాతమంతయు నొకసమయమందొకానొక దేశమందుద్భవమొందుచు, కొండొకసమయమున నశించుచు, ఆద్యంతరూపము గలదై యున్నది. దేశకాలావచ్ఛిన్నమగు నీ ద్వైతసంఘాతముయొక్క ఆద్యంతములు కొండొక దేశకాల, విభేదరహిత అవ్యక్తమందు కలుసుచున్నవి.

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ తత్రకా పరిదేవనా ॥" గీత 2-28.

ఆ అవ్యక్త సత్తా స్వరూపమందీ దేశకాలపరిచ్ఛిన్న ద్వైతస్ఫూర్తి కవకాశములేదు. అందీ 'అహం-త్వం' ప్రత్యయార్థబహుళమైన పరిచ్ఛిన్నతయు, ఖండతయు, క్షరభావమును ఉండజాలవు.

"అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య ననివర్తంతే తద్ధామ పరమం మమ ॥
గీత 8-21.

అందుచే అది ఏకాకారమును, జ్ఞాతృ-జ్ఞేయ, భోక్తృ-భోగ్యాది సంబంధ వికల్ప రహితమును, అపరిచ్ఛిన్నమును, అవ్యయమును, అక్షరమును, అభయస్వరూపమునై అఖండాకారమున వెలుగొందు తత్త్వమైయున్నది. ఈ అవ్యక్తమందు ద్వైతస్ఫూర్తి లేనందున అబాధితమై అభయరూపమున వెలుగొందును. అబాధితమైన ఈ అవ్యక్తాఖండాభయతత్త్వమే

పరమసత్యమును, సర్వమునకాత్మయు, బ్రహ్మము నా బరగు చున్నది.

ఈ అఖండాభయ అవ్యక్త బ్రహ్మసత్తాను లేదని నిరాకరింప సాధ్యముకాదు. అట్టి నిరాకరణ హాస్యాస్పదము. అఖండబ్రహ్మనే లేదనుచో నిరాకరించువాని ఖండసత్తాయే నిరాకరింపబడవలసి వచ్చును. అవ్యక్తాఖండము మీదనే నిరాకరించువాని ఖండసత్తా ఆధారపడి యుండుటచే అఖండబ్రహ్మ సత్తా నిరాకరింప వలనుపడదు. స్వర్ణమే లేదనిన భిన్నాభరణములు లేనివగునట్లు మృత్తికాభావముచే ఘటశరావాదు లభావమగునట్లు, జలధియే లేనిచో తరంగ,ఫేన,బుద్బుదాదుల బహుళతయే లేనియట్లు, అవ్యక్తాఖండ నిత్యాక్షరబ్రహ్మమే లేనిచో వ్యక్త,పరిచ్ఛిన్న,క్షణవిధ్వంసులగు అహం-త్వం ప్రత్యయార్థ సంఘాతస్ఫూర్తియే లేనిదగును. క్షర,వ్యక్త,పరిచ్ఛిన్న, స్ఫూర్తిచేతనే అవ్యక్తాఖండాభయ బ్రహ్మసత్తాసిద్ధి యగుచున్నది. "అసన్నేవ స భవతి।అసత్ బ్రహ్మేతి వేదచేత్॥ అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతో విదురితి." (2—6) "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్। యదేష ఆకాశ ఆనందో నస్యాత్। ఏష హ్యేవానందయాతి।" అని తైత్తిరీయ శ్రుతి (బ్రహ్మవల్లి) బ్రహ్మసత్తా నిరాకరింపరాదని సిద్ధాంతముచేయు చున్నది. మరియు అక్షరాఖండాభయ బ్రహ్మసత్తాను శ్రుతులీ క్రిందిరీతిని రూపిపబఱచుచున్నవి.

"సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ।ఏకమేవాద్వితీయమ్ (ఛాందో
గ్యం 6-2)

"సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాందోగ్యము 3-14)

"ఆత్మావా ఇదమేకఏవాగ్రఆసీత్। నాన్యత్కించనమిషత్।"
(ఐతరేయ- 1-1)

"సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ"తైత్తిరీయము.

"అచింత్యమవ్యక్తమనన్తరూపం శివం ప్రశాన్తఅమృతం
బ్రహ్మయోనిం, తమాదిమధ్యాంతవిహీనమేకం, విభుం
చిదానందమరూపమద్భుతమ్"॥ (కైవల్యోపనిషత్ 6.)

"యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుశ్శ్రోత్రం తద
పాణిపాదమ్।నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం యదవ్యయం
యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" (ముండక 1-6.)

'యథోర్ణనాభిః సృజతే గృహ్ణతేచ యథాపృథివ్యామోషధయ
స్సంభవన్తి।యథాసతః పురుషాత్కేశలోమాని తథాఽక్షరా
త్సంభవతీహ విశ్వమ్"। (ముండక 1-81)

మరియు అబాధితమగు ఈ అభయబ్రహ్మమే సత్యం
బుద్ధం శివం పూర్ణం శాన్తం శుభ్రం కేవలం ఆనందం
అనియు, నిర్గుణం నిష్క్రియం నిర్మలం నిశ్చలం నిరంజనం
నిర్విశేషం అనుబహువిధనామములు శ్రుతులందు పేర్కొన
బడినది.

ఇక ఘోర, హేయ, అనిష్టరూపసంసృతిభయము తొలగి స్వస్వరూపాభయ, బ్రహ్మానందసిద్ధిని బడయు మార్గ మెయ్యది యన నన్నిటికంటె ప్రథమముగ "మహాజనో యేన గతః స పన్థాః" యని సమాధానము చెప్పబడుచున్నది. అనగా మహానుభావులగు తత్త్వదర్శులు అనగా ఋషులు (ఋషయః తత్త్వద్రష్టారః) శ్రుతిరూపప్రమాణముచేతను, స్వానుభవముచేతను నిరూపించిన ఆచరణమే భయసన్యాసము నకు, అభయబ్రహ్మతత్త్వసంసిద్ధికిని మార్గము. కాని "వేదా విభిన్నాః స్మృతయశ్చ భిన్నాః మహామునీనాం మతయశ్చ భిన్నాః" యని చెప్పబడినటుల ఋషులయొక్కయు, శ్రుతుల యొక్కయు మార్గములు పలురీతులుగా కానవచ్చుచున్నవే, అందెయ్యది యుచితాచరణీయమని సంశయము కలుగవ చ్చును. కాని పలువిధములుగదోచు నీ ఋషి, శ్రుతి, ప్రోక్త మార్గములందెద్దియును దోషయుక్తముకాక అన్నియు భయస న్యాసము, అభయసంసిద్ధి యనునొకే పరమగమ్యము కలవై యున్నవి. 'అనంతావై వేదాః'.

'బహుధాప్యాగమైర్భిన్నాః పన్థానః సిద్ధిహేతవః'

'ఆకాశాత్పతితం తోయం, యథా గచ్ఛతి సాగరమ్
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి'.

'సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః'

'యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే'

'యం శైవాః సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి మీమాంసకాః।
అర్హన్నిత్యథ జైన శాస్త్రనిరతాః కర్తేతి నైయాయికాః
సోయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః॥
ఏకం సద్విప్రాః బహుధా వదన్తి'' ఇత్యాది ప్రమాణములను బట్టి దర్శనకారులు తత్త్వద్రష్టలునగు ఋషులకెల్లరకును అభయసిద్ధియే పరమగమ్యమనియు వారలయొక్కయు సాధకుల యొక్కయు పూర్వసంస్కారజన్య,మానసికస్వభావమునుబట్టియు వారల సాధనాభ్యాసమును బట్టియు, సాధకులయొక్క అధికారతారతమ్యమును బట్టియు సాధనోపాయములందు మాత్రము వివిధక్రమములుపదేశింపబడినట్లును సాధనోపాయ వివిధత్వమనివార్యమనియును ఆవశ్యకమేయనియు విదితమగుచున్నది. ఆరోగ్యప్రాప్తియే రోగులందరకును గమ్యమైనను వారల రోగవైవిధ్యమునుబట్టి వివిధ ఔషధసేవలను వైద్యుడు వారలచే జేయించునట్లు, శ్రుతి ఋషి ప్రోక్తభిన్నసాధనక్రమములును సాధకుల యధికారతారతమ్యమునుబట్టియు యథోచితములై యున్నవనుటలో సందియమావంతయును లేదు. కాని రోగి, రోగనిదాననిపుణుడైన ఒక వైద్యునాశ్రయించునట్లు, అభయసంసిద్ధినన్వేషించుసాధకుడును అభయసంసిద్ధియందు స్థితప్రజ్ఞుడై రాజిల్లు నొక సద్గురునాశ్రయించి, తదనుగ్రహామునుసంపాదించి, తదుపదిష్ట సాధనాక్రమంబులాచరింపదగును.

"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా
న్నాస్త్యకృతః కృతేన।తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్,
సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥" (ముండక. 1–12)
"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥ (గీత 4–34)
"ఆచార్యవాన్ పురుషో వేద"
"దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహహేతుకమ్।
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః॥
వివేకచూడామణి —3.

ఇత్యాదిప్రమాణములచే సద్గురుసమాశ్రయము సాధకున కవశ్యకర్తవ్యముగా నిరూపింపబడినది.)

భయవిముక్తియు అభయసిద్ధియును తత్త్వదర్శులెల్లర మతమని నుడివియేయుంటిమి. అభయసిద్ధి కావలెననిన భయ దూరీకరణమునకై సద్గురుసమాశ్రయమావశ్యకము. సద్గురు సేవచేతను, తదుపదేశవిశేషములచేతను అభయసిద్ధియు ప్రాప్తించును. ఆరోగ్యము పథ్యాపథ్యాదుల రెండిటిపై నాధారపడునట్లు, భయదూరీకరణ — అభయసిద్ధి అను రెండును అవినాభావముగ వర్తించును. అందుచే నీరెండును తోడ్తోడ యవలంబనీయములై యున్నవి. పక్షద్వయముతో గూడిన యీమార్గమునే "వైరాగ్యాభ్యాసాభ్యామ్"అని యోగశాస్త్ర కారుడుపదేశించెను. అనిష్ట భయత్యాగమును ఇష్ట అభయా

నుసంధానమును అవినాభావముగ సాధకునకు ఆచరింపదగిన దని అభిప్రాయము. ఈ విషయమునే ఈక్రింది ప్రమాణములు కూడ నిర్దేశించుచున్నటుల కానవగును.

'వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః సన్యాసయోగాద్ యతయః శుద్ధసత్వాః' (తైత్తిరీయ 4-28)

'అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే।

(గీత 6-35)

అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్ । సన్యస్త బాహ్యార్థసుఖ స్పృహస్సన్ । సన్తం మహాన్తం సముపేత్య దేశికం తేనోపదిష్టార్థ సమాహితాత్మా ॥' (వివేకచూడామణి-8)

'ముక్తిమిచ్ఛసి చేత్తాత । విషయాన్ విషవత్త్యజ । క్షమార్జవదయాతోష సత్యం పీయూషవద్భజ॥' (అష్టావక్ర గీత)

'యాన్యనవద్యాని కర్మాణి, తాని సేవితవ్యాని, నో ఇతరాణి'

(తైత్తిరీయ)

భయదూరీకరణప్రయత్నమే వైరాగ్యమనియు, అభయసిద్ధినిగూర్చిన అనుసంధానమే అభ్యాసమనియు నెఱుంగు నది. ఒక నదీతటమున బంధింపబడిన నౌకను రెండవతటము నకు చేర్చవలయుననిన తటమునకు బంధింపబడిన బంధనలను ఛేదించుటయు, రెండవతటమందలి నిర్ణీత, లక్ష్యస్థానమునకు తెడ్ల సహాయముచే నడుపుటయు అను ద్వివిధరూప ప్రయత్నమునవలె ఇందును భయదూరీకరణమునుగూర్చి వైరాగ్య

ము, అభయసంసిద్ధిని ప్రతిష్ఠింపజేయు అభ్యాసము అను పక్ష ద్వయమార్గమవశ్యాచరణీయమై యున్నది.

భయదూరీకరణ సాధనమగు వైరాగ్యమునుగూర్చి విచారింతము. వైరాగ్యమనగా అనురాగములేకుండుట. అనగా అనిష్టమును భయకారణమునగు ఏ వస్తుజాతముకలదో దాని యెడ విముఖతయు, నిగ్రహమును వైరాగ్యమనజెల్లును. భయ కారణము ద్వైతభానమేయనియు, ద్వైతభానముండునంతవఱకు భయమనివార్యమనియు, ఈద్వైతభానమునకు పరిచ్ఛిన్న అజ్ఞాన బీజభూతమైన అహం–త్వం'ప్రత్యయార్థభావనయే మూలమని యు"త్వం"ప్రత్యయార్థబహుళతకుసైతము"అహం"ప్రత్యయా ర్థమే మూలమనియు కించిజ్ఞత్వాది బీజాజ్ఞానయుతమైన'అహం' ప్రత్యయార్థమే సమస్తద్వైతభానమునకును భయావరణకును ఘోరకారణమగుచున్నదనియు ప్రథమముననే నిరూపించి యుంటిమి.

"తస్మాదహంకారమిమం స్వశత్రుం। భోక్తుర్గళే కంటకవత్ప్ర తీతం॥విచ్ఛిద్య విజ్ఞానమహాసినా స్ఫుటం। భుంగ్క్ష్వాఽత్మ సామ్రాజ్యసుఖం యథేష్టమ్॥ (వివేకచూడామణి– 308)

దీనిచే నీద్వైతభయకారణమెల్ల "అహం" ప్రత్యయార్థ మేననియు 'అహం' ప్రత్యయార్థనిగ్రహముచే భయదూరీకర ణము సఫలమగుననియు తెల్లమగుచున్నది. ఈ'అహం'ప్రత్య యార్థమందే సమస్తభేదభయభూతమగు భేదాజ్ఞానము నిహిత

మైయుండి అభివ్యక్తమగుచు జీవుల బాధించుచున్నది. ఈ 'అహం' ప్రత్యయార్థమే మనస్సనియు, చిత్తమనియు, అంతఃకరణమనియు, అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమనియుకూడ సాముదాయికముగ, వేదాంతశాస్త్రమున, పలుతావులందు వ్యవహరింపబడుచున్నది. 'అహం' ప్రత్యయార్థమే చిత్తమని యోగశాస్త్రమందును, బుద్ధి'యని సాంఖ్యదర్శనమందును వ్యవహరింపబడినట్లు కాననగును. పరిచ్ఛిన్నజ్ఞానబీజభూతములు, భయకారణమును అగు ఈ 'అహం'ప్రత్యయార్థనిగ్రహమునే వైరాగ్యమందురు. దీనినే చిత్తనిరోధమని యోగశాస్త్రకారుడును, బుద్ధినిగ్రహమని సాంఖ్యదర్శనకారుడును, అంతఃకరణలేక చిత్త లేకమనోలయ(నాశము)మని వేదాంతులును, కర్తృత్వత్యాగమని కర్మయోగులును, ఆత్మనివేదనమని భక్తియోగులును పేర్కొనుచున్నారు. కావున ఎల్లరకును భయనివృత్తికై 'అహం'ప్రత్యయార్థనిగ్రహమను వైరాగ్యము సమ్మతమును అవశ్యాచరణీయము అని విదితమగుచున్నది.

ఈ 'అహం'ప్రత్యయార్థము సదా, పూర్వవాసనాయుత బలముచేతను, విక్షేపశక్తిమూలమునను, దేహాధ్యాస ద్వైత విషయానురాగములతో కూడినయసంఖ్యాక వృత్తిరూపములలో పరిణమించుచు, ఆ వృత్తులబలముచే బహిర్ముఖతనొంది, స్థూల దేహ, స్థూలవిషయ సారూప్య తాదాత్మ్యాధ్యాస బంధమందును, తత్తత్సాంగత్యజనిత రాగద్వేషాది కర్మపరంపరలం

పును తగులొ్కని తిరుగాడుచుండును. ఈవిధమైన 'అహం' ప్రత్యయార్థ పరిణామమే ద్వైతభయమూలమని నుడివియుంటిమి.

కావున ఈ 'అహం'ప్రత్యయార్థ పరిణామోన్మూలనముచే గాని భయోన్మూలనము కాజాలదు. భేదప్రత్యయకారణమైన 'అహం' ప్రత్యయమే మిథ్యాజ్ఞానమనబడును. ఈమిథ్యాజ్ఞానముచేతనే భయప్రాప్తి దుఃఖప్రాప్తి యగుచున్నది. భేదజనకమగు ఈ 'అహం'ప్రత్యయ మిథ్యాజ్ఞానరూపము నివర్తించుచో భయరూపమైన దుఃఖము నివర్తించును. "దుఃఖజన్మప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానానాం ఉత్తరోత్తరాపాయే తదనన్తరాపాయాదపవర్గః" యనునైయాయికుల సూత్రమిచట అన్వయింపదగియున్నది. 'అహం'ప్రత్యయార్థనిర్మూలనమునుగూర్చి శ్రీమచ్ఛంకరభగవత్పాదులిట్లు నిరూపించిరి.

"చిత్తమూలో వికల్పోఽయం చిత్తాపాయే న కశ్చన।
అతశ్చిత్తం సమాధేహి ప్రత్యగ్రూపే పరాత్మని"॥

వివేకచూడామణి 408

ఈపరిణామయుక్త అహంప్రత్యయార్థనిగ్రహమను వైరాగ్యము, బాహ్యము ఆంతరము అనిద్వివిధము. 'త్వం'ప్రత్యయార్థ దృశ్యవిషయ,సంఘాతరూపమున భాసించుచు, ఇంద్రియ సన్నికర్షణద్వారమున 'అహం'ప్రత్యయార్థమునకు వికల్పమును బాధను ఒనగూర్చు ఆవిషయసంఘాతమునెడను, తత్సాంగత్య

కర్మలయెడను, తద్విషయసాంగత్యమునకును, అధ్యాసకును ఆశ్రయమగు దేహేంద్రియాదులయెడను 'అహం'ప్రత్యయార్థా భిమాన వ్యాపారమును బోనీక మరల్చుటయే బాహ్యవైరా గ్యమనబడును. ఈనిగ్రహముచే బాహ్యసంఘర్షణచే జనించు భయకారణనివృత్తి యగును. ఈబాహ్యవిషయేంద్రియ వైరా గ్యమునే దమమని వేదాంతశాస్త్రమందు పేర్కొనిరి. ఇక అంత రంగమున భేదాజ్ఞాన బీజభూతమైవర్తించు 'అహం'ప్రత్య యార్థవృత్తిని తద్విక్షేపరూపమగు కామ,క్రోధ,లోభ,మోహ, మద, మత్సర, దంభ, దర్ప, కపట, హింస, శోక, భయాదిసంక ల్పములను లోక, దేహ, శాస్త్రాది వాసనలను పొడచూపినప్పు డెల్ల నిషేధించుచుండుటయే ఆంతరిక వైరాగ్యమనబడును. ఈ ఆంతరికవైరాగ్యమునే వేదాంతశాస్త్రమున శమమని పేర్కొనిరి.దీనిచే ఆంతరిక బీజరూప భయకారణము నివర్తిం చుచు భయదూరీకరణసాధన సఫలమగుచున్నది. "అహం" ప్రత్యయార్థద్వివిధ పరిణామవైరాగ్యమును శ్రీమచ్ఛంకర భగ వత్పాదులిట్లువివరించిరి.

''అంతస్త్యాగో బహిస్త్యాగో విరక్తస్యైవ యుజ్యతే
త్యజత్యంతర్బహిస్సంగం విరక్తస్తు ముముక్షయా॥
బహిస్తు విషయైస్సంగం తథాంతరహమాదిభిః।
విరక్తఏవ శక్నోతి త్యక్తుం బ్రహ్మణి నిష్ఠితః॥

వివేకచూడామణి- 373,374.

భయకారణమీద్వివిధ పరిణామరూప 'అహం' ప్రత్యయార్థమందే ఇమిడియున్నదని వివేకించి గ్రహించి తన్నిరోధరూపవైరాగ్యమునకు గడంగవలెను.

ఇక అభయసంసిద్ధిహేతువగు అభ్యాసమును నిర్వచింపదగును. అఖండాద్వయబ్రహ్మమే అభయరూపముగను జీవుల యభీష్టముగను స్వస్వరూపముగను ప్రథమమున నిరూపించి యేయుంటిమి. స్వాత్మరూపమగు నఖండాద్వయబ్రహ్మైక్యానుభవసిద్ధి చేతనే అభయసంసిద్ధి కరతలామలకమగుచున్నది. కావున తత్సంసిద్ధియే సాధనీయము. ఇది చిరతరశ్రద్ధాభక్తి పూర్వకనిరంతరబ్రహ్మస్వరూపలక్ష్యానుసంధానముచే సిద్ధించుచున్నది. "స తు దీర్ఘకాల నైరంతర్య సత్కార సేవితో దృఢభూమిః" (యోగసూత్రము 1-14). "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" (గీత 7-9) అను ప్రమాణములు నిరంతర చిరాతరానుసంధానావశ్యకతను సూచించుచున్నవి.

ఈ బ్రహ్మానుసంధానక్రమమును శ్రుతి యిట్లు ప్రబోధించుచున్నది. "ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః". ఆత్మానుభూతికి (బ్రహ్మానుభూతి) శ్రవణ, మనన, నిదిధ్యాసలు క్రమావలంబనీయములని భావార్థము. ఈ విషయమే వేరొక తావున నిట్లు వివరింపబడెను.

'శ్రోతవ్యః శ్రుతి వాక్యేభ్యో మంతవ్యశ్చోపపత్తిభిః ।
మత్వాచ సతతం ధ్యేయో హ్యేతే దర్శన హేతవః॥"

అనగా 'సదేవ సోమ్యేదమగ్రఆసీ దేకమేవాద్వితీయం, సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి'.

'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ'

'నాన్తఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం న ప్రజ్ఞాన ఘనం, న ప్రజ్ఞం నాప్రజ్ఞం, అదృష్టమవ్యవహార్యమగ్రాహ్య మలక్షణమచింత్యమవ్యపదేశ్యమేకాత్మప్రత్యయసారం ప్రపం చోపశమం, శాన్తం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః'.

'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' 'ప్రజ్ఞానం బ్రహ్మ' 'అయమాత్మా బ్రహ్మ' 'జన్మాద్యస్య యతః'. ఇత్యాది బ్రహ్మస్వరూప నిర్దేశక శ్రుతి వాక్యములను సహేతుకముగ సద్గురునిద్వారా శ్రద్ధాభక్తిసంయుత సావధానచిత్తముతో ప్రథమమున శ్రవణము చేయుచుండవలెను. ఇట్లు పలుమారు బ్రహ్మస్వరూప నిర్దేశక వేదాంతవాక్యార్థములను శ్రవణము చేయుచుండుటచే మనంబున సదా తద్విచారణయే జనించు చుండును. ఇట్టి విచారమూలమున బ్రహ్మస్వరూప సత్తాలను గూర్చిన విరోధ శంకలను 'తత్తు సమన్వయాత్' అని బ్రహ్మ సూత్రకారుడు నిర్వచించినట్టుల శ్రుత శ్రుతివాక్యార్థ సహే తుక సమన్వయముద్వారా నివారించి బ్రహ్మస్వరూపనిశ్చయ చిత్తసమాధానమునొందుట మనన మనబడును. ఇట్లుగావించిన శ్రవణమననములచే నిర్దిష్టమైన బ్రహ్మమందు తీవ్రమైన శ్రద్ధ యు, భక్తియు జనించును.

ఈ శ్రద్ధాభక్తులు క్రమముగా ధ్యానరూపము దాల్చును. అనగా బ్రహ్మస్వరూప సాక్షాత్కార లక్ష్యమందే లక్ష్యము సమాహిత మగుచుండును. 'శ్రద్ధా, భక్తి, ధ్యాన యోగాదవేహి' యని శ్రుతి నుడువుచున్నది. ఈ లక్ష్య బ్రహ్మ సమాహిత రహస్యవిధిని సద్గురునిచే బడయవలెను. రోగుల తారతమ్యమునుబట్టి వైద్యుడౌషధముల నిచ్చురీతి, సాధకుని మానసిక స్వభావ, మందమధ్యమ తీవ్ర అధికార తారతమ్యమునుబట్టి శబ్దప్రతీకధ్యానమో (ఓంకారాది నాదధ్యానము) రూపప్రతీకధ్యానమో (ఓంకారాది సాంకేతిక రూప ధ్యానము) భావప్రతీకధ్యానమో (సత్ చిత్ ఆనంద అనంత పూర్ణ ఇత్యాది బ్రహ్మభావధ్యానము) నేతిమార్గపూర్వక వృత్తిరహిత శుద్ధ నిరుపాధిక అమనస్క బ్రహ్మధ్యానమో సద్గురునిచే ఉపదేశింపబడుచుండును. ఈ వివిధ సాధనాక్రమములలో కొన్నిటినీ క్రిందిశ్రుతులందు గాననగును.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వ ముముక్షుభిః"
"హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలం। తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్యదాత్మవిదో విదుః" (ముండక 2-10)
"సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్" (తైత్తిరీయ)
"హృత్పుండరీకంవిరజం విశుద్ధం విచింత్య మధ్యే విశదం విశోకం అనాది మధ్యాంత విహీనమేకం విభుం చిదానందమరూప

మచ్ఛృతమ్...ధ్యాత్వాముని ర్గచ్ఛతి భూతయోనిం సమస్త సాక్షిం తమసఃపరస్తాత్'' (కైవల్య 6)

''పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్. అధో నిష్ట్యావితస్త్యాంతే నాభ్యాముపరి తిష్ఠతి।జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాయతనం మహత్।...నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా. తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।స బ్రహ్మ స శివ స్సహరిస్సేంద్రస్సోక్షరః పరమస్స్వరాట్॥'' (తైత్తిరీయ.)

''పరేణ నాకం నిహితం గుహాయాం బిభ్రాజదేతద్యతయో విశంతి'' (తైత్తిరీయ)

''ఏషస్వయం జ్యోతిరశేషసాక్షీ, విజ్ఞానకోశే విలసత్యజస్రమ్। లక్ష్యంవిధాయైనమసద్విలక్షణమఖండ వృత్త్యాత్మతయాను భావయా॥'' (వివేకచూడామణి- 381)

''తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్'' (గాయత్రి)

"యతో వాచోనివర్తంతే అప్రాప్య మనసా సహ" (తైత్తిరీయ)

''యన్మనసా నమనుతే యేనాహుర్మనో మతమ్।తదేవ బ్రహ్మత్వంవిద్ధి నేదం యదిదముపాసతే" (కేన- 1-6)

"తైలధారావదచ్ఛిన్నం ధ్యానం." ''నిమిషార్థం న తిష్ఠన్తి వృత్తిం బ్రహ్మమయీం వినా'' యని చెప్పబడినరీతి అన్యవృత్తులనుండి మరల్చిన అహంవృత్తిని సద్గురూపదిష్ట

బ్రహ్మాకారమందే తైలధారావదచ్ఛిన్న ధ్యానవృత్తిలో లగ్న ముచేసి చిరతరాభ్యాసము సల్పుచో, అగ్నిదగ్ధకాష్ఠము చంద మున, బీజాజ్ఞాన సహితముగా 'అహం'ప్రత్యయార్థము ధ్యానా గ్నిచే బ్రహ్మమందు లయించి తద్గత సత్తా అఖండబ్రహ్మై క్యము నొందును. ధ్యానాభ్యాసకృత అహంప్రత్యయార్థలయ పూర్వక అఖండాద్వయబ్రహ్మైక్యమే సమాధి యనబడుచు న్నది. 'సమాధిః సమతావస్థా జీవాత్మ పరమాత్మనోః' 'జీవ బ్రహ్మయోరైక్యం సమాధిః' అనిశ్రుతి నిర్వచించుచున్నది. ఈధ్యానాభ్యాసపూర్వక సమాధిప్రాప్తియే 'నిదిధ్యాస' యన బడుచున్నది.

పై జెప్పిన శ్రవణ, మనన, నిదిధ్యాసలే అభ్యాసమన బడును. ఈ అభ్యాసవశముననే అఖండాభయబ్రహ్మసంసిద్ధి యగుచున్నది. ఈ అభ్యాసమందు బీజసహిత 'అహం'ప్రత్య యార్థ విలయముకూడ నిమిడియుండుటచే వైరాగ్యముగూడ నిందిమిడియున్నది. వైరాగ్యాభ్యాసములు రెండును . అభయ సంసిద్ధి బడయువఱకు అవినాభావముతో వర్తించును. వైరా గ్యము చిత్తశాంతిద్వారా అభ్యాసమునకు సహకారి అగు చుండును. అట్లే బ్రహ్మానుసంధానమను అభ్యాసము బీజ సహిత 'అహం'ప్రత్యయార్థవిలయమనబడు వైరాగ్యమునకు తోడ్పడుచుండును. వైరాగ్యములేనిదే బ్రహ్మానుసంధాన మందేకాగ్రలక్ష్యము కలుగుట దుష్కరము. అట్లే బ్రహ్మాను సంధానము లేనిదే 'అహం'వృత్తియొక్క చాంచల్యశాంతియు

లయమును దుర్లభము.గాన వైరాగ్యాభ్యాసములు అభయ సంసిద్ధిపఱకు అవినాభావముగ అవలంబనీయములు. వైరాగ్యాభ్యాసములకు సహకారములగు వివిధసాధనసంపత్తులు శ్రుతి, శాస్త్రములందు నిరూపింపబడియున్నవి.

సమాధిలాభముచే భేద, భయమూలమగు బీజాజ్ఞాన సహిత "అహం"ప్రత్యయార్థపరిణామసంసృతియెల్ల, ఆత్యంతికముగ లయించుటయు అఖండానంద ఏకాద్వితీయ బ్రహ్మైక్యము సిద్ధించుటయు, ఈరెంటిమూలమున ఘోరంద్వైత సంసృతిభయ వినిర్ముక్తియు జీవితాభీష్టమును స్వాత్మరూపమునునైన నిరతిశయ సచ్చిదానందాద్వయాభయబ్రహ్మసంసిద్ధియు ప్రాప్తించుచున్నది. ఇదియే జీవితమును సజీవముగ, పరమానందముగ, అమృతరూపముగ, చిన్మయముగ జేయు రాజమార్గము. అభయబ్రహ్మానందానుభూతియొక్క ఘనతను, ధన్యతను శ్రుతులీరీతి కీర్తించుచున్నవి :

"బ్రహ్మవిదాప్నోతి పరం। ...సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ। యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్। సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి॥"

'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ।

ఆనన్దం బ్రహ్మణో విద్వాన్। న బిభేతి కదా చనేతి॥'

(తైత్తిరీయ-బ్రహ్మవల్లి)

'యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽ నిలయ నేఽభయం ప్రతిష్ఠాం విందతే। అథసోఽభయం గతో భవతి॥

యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమంతరం కురుతే। అథ తస్య భయం భవతి॥ తత్త్వేవ భయం విదుషోఽమన్వానస్య'.

(తైత్తిరీయ-బ్రహ్మవల్లి)

'సయోహవై పరమం బ్రహ్మవేద। బ్రహ్మైవ భవతి నాస్యా బ్రహ్మవిత్కులే భవతి। తరతి శోకం తరతి పాప్మానం గుహా గ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి॥' (ముండక 3-2-9)

'భిద్యతే హృదయ గ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయంతేచాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే॥'

(ముండక 2-2-8)

కావున ఘోర సంసృతిభయ పాశ వినిర్ముక్తిని, అభయసంసిద్ధిని కోరు నెల్లరును వైరాగ్యఅభ్యాసయుక్త మగు నీ దివ్య రాజమార్గాశ్రితులై అభయబ్రహ్మానందసంసిద్ధిని బడసి కృతార్థులగుదురుగాక!

"సర్వభూతేభ్యోఽభయం భూయాత్!"

తిరుపతి తిరుమలగిరి,
వైకుంఠతీర్థగుహా,
దీ. 23-6-1941

ఓం తత్ సత్!

